శ్రీమతే రామానుజాయ నమః



## సాంప్రదాయిక వ్యాస మాలిక - 1

# ఉభయవేదాంతైకకంఠ్యం, ఆదిశేషావతారాలు, జీయర్ శబ్దార్థం


<u>అనువాదకులు:</u>

పండితరత్న, ఉ.వే.శ్రీమాన్

ఈయుణ్ణి అళహ శింగరాచార్య స్వామి వారు

<u>సంపాదకుడు:</u>

ఈయుణ్ణి అనంత రంగ రామన్

## భగవద్రామానుజ 1004వ తిరునక్షత్రోత్సవాల సందర్భంగా

**(18-04-2021)**

# నివేదన

వైదికమైన విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ప్రచారం చేసిన పూర్వాచార్యులలో భగవద్రామానుజులు అగ్రగణ్యులు. వీరి తర్వాత ఎంతోమంది ఆచార్యులు ఈ సిద్ధాంతాన్ని తమ గ్రంథాలతో, ప్రవచనాలతో రక్షించి జిజ్ఞాసువులకు అందరికీ అందజేశారు. గత శతాబ్దిలో ఈ సిద్ధాంతాన్ని తమిళదేశంలో ప్రచారం చేసిన మహనీయులలో శ్రీమాన్ కార్పం గాడు వేంకటాచార్యస్వామి, వేళుక్కుడి వరదాచార్య స్వామి, తిరుపతి టి. ఏ. కృష్ణమాచార్యస్వామి మొదలైనవారు ఎంతమందో ఉన్నారు. వీరు భగవద్రామానుజ సిద్ధాంతంలోని విశేషాలను తెలియజేస్తూ ఎన్నో వ్యాసాలను తమిళ భాషలో రచించారు. అయితే ఇవి కేవలం తమిళం తెలిసినవారికి మాత్రమే అందుబాటులో ఉన్నందున, వీటినిఆంధ్రీకరిస్తే ఆంధ్రదేశంలోని సంప్రదాయజ్ఞానపిపాసువులకు ఉపయుక్తంగా ఉంటుందని ప్రస్తుతం కొన్ని తమిళవ్యాసాలకు అనువాదాలను ఈ లఘు గ్రంథరూపంగా సంప్రదాయ పాఠకులకు అందివ్వడం జరుగుతున్నది. క్రమంగా ఈ విధంగానే మరికొన్ని తమిళవ్యాసాలకు అనువాదాలను చేసి సహృదయ పాఠకులకు అందజేయడం జరుగుతుంది. ఈ వాచికకైంకర్యం భగవద్రామానుజుల 1004వ అవతారమహోత్సవ సందర్భంగా ప్రచురించబడుతున్నది.

**శ్రీమద్రామానుజగురోః**
**పాదయుగ్మే సమర్ప్యతే ।**
**వాచికీ పరిచర్యేయం**
**శ్రద్ధయా వ్యాసమాలికా ।।**

**- భవదీయుడు, ఈయుణ్ణి అళ్గహ శింగరాచార్యులు**



న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే.శ్రీమాన్ కార్పంగాడు వేంకటాచార్య స్వామి

# ఉభయవేదాంతైకకంఠ్యమ్

**(న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే.శ్రీమాన్ కార్పంగాడు వేంకటాచార్య స్వామివారి తమిళ వ్యాసం ఆధారంగా)**

శ్రియఃపతి అయిన భగవంతుని నిర్హేతుకమైన కృపకు పాత్రులైన దివ్యసూరులనుండి ఆరంభించి శ్రీయామునులు, శ్రీరామానుజులు, వేదాంత దేశికులు, మొదలైనవారిని మధ్యలో కలిగి, శ్రీవరవరములను చివరలో కలిగిన మన ఆచార్య పరంపర " శ్రీమన్నారాయణుడే పరతత్వం, అతని శ్రీచరణాలే హితం, ఆ భగవానుని శ్రీచరణారవిందాలలో చేసే కైంకర్యమే పరమ పురుషార్థం"– అని ఈ విధంగా తత్వహితపురుషార్థాలను తమ ఉపదేశాలతో, గ్రంథాలతో వ్యక్తం చేసింది. తత్త్వ హిత పురుషార్థాలను ఈ విధంగా యథాతథంగా తెలిసినవారే గొప్పదైన పురుషార్థాన్ని పొందగలరు.

వీటిని ఈ విధంగా యథాతథంగా తెలిపే శాస్త్రాలలో గొప్ప శాస్త్రం వేదమని చెప్పబడుతున్నది. "వేదశాస్త్రాత్ పరం నాస్తి న దైవం కేశవాత్పరమ్" అనే వచనం ఈ విషయంలో ప్రమాణం. ఆ వేదం సంస్కృత వేదమని, ద్రావిడ వేదమని రెండు విధాలుగా ఉంటుంది. సంస్కృత వేదంవలె ద్రావిడ వేదం కూడా ఉన్నది అనే విషయాన్ని "వడమొழி మఱై ఎన్గదు తెన్ మొழி మఱైయై నినైత్తిఱే" (ఆళ్వారులు "వడమొళి" అని ద్రావిడవేదమనే అర్థాన్ని తెలిపే పదాన్ని ప్రయోగించడానికి కారణం సంస్కృతవేదాన్ని దృష్టిలో పెట్టుకొని) అని అழకియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనే ఆచార్యులు ఆచార్య హృదయం అనే గ్రంథంలో అన్నారు. దీనిని వివరిస్తూ శ్రీవరవరమునులు "అదావదు– మఱై ఎన్ఱు కేవలవేదరాశిశబ్దత్తాలే శొల్ల అమైన్దిరుక్క –వడమొழி మఱై–ఎన్ఱు సంస్కృతవేదమెన్గదు ద్రావిడవేదముమ్ నినైత్తిఱే – ఎన్నై. ప్రతికోటి యిల్లాదపోదు ఇప్పడి విశేషిక్కవేణ్డియదిల్లైయిఱే–ఎన్ఱు కరుత్తు" ( దీని అర్థం ఏమంటే–మఱై అని వేదాన్ని తెలిపే శబ్దంతో మాత్రం చెప్పవలసి ఉండగా, ఆ విధంగా కాకుండా, "వడమొழி మఱై" అని సంస్కృత వేదాన్ని నిర్దేశించడం ద్రావిడ వేదంకూడా ఇంకొకటి ఉన్నదని భావించి కదా ఆ విధంగా పలుకడం జరిగింది. లేనప్పుడు ఈ విధంగా విశేషించి చెప్పవలసిన అవసరం లేదు కదా–అని భావం) అని

శ్రీవరవరమునులు పలికిన ఆచార్యహృదయవ్యాఖ్యాన వివరణంవల్లకూడా ఈ విషయం తెలుస్తున్నది

ఇక్కడ ‘వేదం’ అనే పదం ఆళ్వారుల ప్రబంధాలను నిర్దేశిస్తుంది. పరమభక్తులైన ఆళ్వారులు అనుగ్రహించిన భక్తిరసపూర్ణాలైన ద్రావిడ ప్రబంధాలకు ద్రావిడ వేదం అని పేరు. ఈ విధంగా మానవప్రోక్తాలైన ఈ ప్రబంధాలు నిత్యమైన అపౌరుషేయం అయిన వేదంలో అంతర్భవిస్తాయని, అవి నిత్యాలని అనడం ఏ విధంగా పొసగుతుంది? అని అంటే, మహర్షులు తమ తపఃశక్తి ద్వారా దర్శించిన మంత్రాలు వేదంలో అంతర్భవించినట్లే, భగవంతుడు అనుగ్రహించిన పరిపూర్ణమైన జ్ఞానంతో ఆళ్వారులు దర్శించిన ప్రబంధాలు కూడా నిత్యమని అనడంలో విరోధం ఏమీ లేదు గనక వీటిని కూడా వేదమని అనడంలో ఏ విధమైన విరోధం లేదు. దివ్య సూరులు దర్శించి వ్యక్తం చేసినది దివ్యప్రబంధం అనే విషయం దేశికుల "ఆమ్నాయానాం ప్రకృతిమపరాం సంహితాం దృష్టవంతమ్" (వేదానికి వేరొక రూపమైన ద్రావిడ ప్రబంధాన్ని దర్శించిన నమ్మాళ్వారులు) అనే సూక్తి వల్ల స్పష్టమవుతుంది. "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా" (వేదంచేత ప్రతిపాదించబడే భగవంతుడు శ్రీరాముడుగా అవతరించగా, ఆ వేదం శ్రీరామాయణ రూపంలో వాల్మీకిద్వారా అవతరించింది) అనే స్కాందపురాణం సూక్తిప్రకారం వేదంయొక్క ఆవిర్భావ విశేషంగా శ్రీరామాయణాన్ని చెప్పినట్లే, భగవంతుడు శ్రీరంగం మొదలైన దివ్య దేశాలలో అర్చారూపంలో వేంచేసి ఉన్నపుడు ఆ వేదం ద్రావిడ ప్రబంధంగా అవతరించింది–అని సంస్కృత వేదావిర్భావవిశేషంగానే ఆళ్వారుల దివ్య ప్రబంధాలు చెప్పబడుతున్నాయి. ఇందువల్ల ప్రమేయవస్తువు, అంటే - సంస్కృత వేదంచేత, ద్రావిడవేదంచేత చెప్పబడే వస్తువు అయిన భగవంతుడు అందరికీ సులభంగా ఉండే అర్చారూపాన్ని పొందగా, ఆ భగవంతుని తెలిపే వేదంకూడా సర్వసులభమై, దివ్య సూరుల ప్రబంధాలై, అందరూ తెలిసికొనే రీతిలో అవతరించిన ద్రావిడవేదమైనది–అని తెలుస్తున్నది.

సంస్కృతవేదంలోని పూర్వ భాగం భగవంతుని ఆరాధనారూపమైన కర్మలను వివరిస్తున్నది. ఉత్తర భాగం అనే వేదాంతం ఆ కర్మలచే ఆరాధింపబడే

భగవంతుని స్వరూపస్వభావాలను తెలుపుతున్నది. ఉత్తర భాగానికి వేదాంతం అని పేరు. ఈ సంస్కృత ఉపనిషద్భాగం సర్వేశ్వరుని స్వరూపరూపగుణవిభూతిలీలలు మొదలైన వానిని వర్ణిస్తున్నది. దివ్య ప్రబంధాలుకూడా భగవంతుని స్వరూపరూపగుణవిభూతి లీలలను మధురంగా తెలుపుతున్నందున వీటిని ద్రవిడోపనిషత్ అనే పేరుతో వేదాంతజ్ఞులు వ్యవహరిస్తున్నారు. ఈ విషయాన్ని ద్రవిడోపనిషత్ సంగతి, ద్రవిడోపనిషత్ తాత్పర్యరత్నావళి అని చెప్పబడే గ్రంథాల పేర్ల ద్వారా మనం గమనించవచ్చు. ఇపుడు, ఆళ్వారులు మనకు అందించిన దివ్య ప్రబంధాలు ఉపనిషత్తుల అర్థాలను అంతర్భవించుకొన్నవి–అనే విషయం సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నది.

**తత్వం (శ్రియఃపతి అయిన శ్రీమన్నారాయణుడే పరతత్వం):** సంస్కృత వేదాంతం "కారణం తు ధ్యేయః" అనే వాక్యంద్వారా ఈ జగత్తుకు కారణమైన తత్వమే ధ్యానించదగినది – అని తెలిపి, ఆ జగత్కారణం "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ ప్రయంతి అభిసంవిశంతి తత్ విజ్ఞిజ్ఞాసస్వ తత్ బ్రహ్మేతి" (దేనినుండి ఈ జగత్తు పుడుతున్నదో, పుట్టిన ఈ జగత్తు దేనివల్ల జీవిస్తున్నదో, దేనిలో ఈ జగత్తు ప్రళయకాలంలో ప్రవేశిస్తున్నదో, లీనమవుతున్నదో, దానిని బ్రహ్మం అని తెలుసుకో) అని బ్రహ్మశబ్దాన్ని నిర్వచించింది. జగత్కారణ వస్తువు అయిన ఆ బ్రహ్మం "తత్ ఐక్షత బహుస్యాం ప్రజాయేయ" (ఆ సత్ అనబడే జగత్కారణ వస్తువు 'నేను అనేక విధాలుగా అవుతాను' అని సంకల్పించింది) అనే వాక్యంలో చెప్పిన జ్ఞానం లేని అచేతనవస్తువు జగత్కారణ వస్తువు కంటే వేరైనది అని,"ఆనందమయః" (ఇంత అని తెలియడానికి సాధ్యం కాని గొప్ప ఆనందగుణానికి సముద్రంవంటివాడు) అని చెప్పినందున జ్ఞానం కలిగిన చేతనవస్తువు కంటే పరతత్త్వం వేరైనది అని తెలుస్తున్నది."యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్" (ఏ జ్ఞానంతో అక్షరుడైన పురుషుని తెలిసికుంటున్నాడో ఆ బ్రహ్మవిద్యను శిష్యునకు ఉపాధ్యాయుడు ఉపదేశించాలి) అని చెప్పబడినందున ఆ జగత్కారణ వస్తువు పురుషుడు అని తెలుస్తున్నది. "య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే తస్య యథాకప్యాసం పుండరీకమేవ మక్షిణీ" (ఆదిత్య మండలం మధ్యలో బంగారు వర్ణం కలిగిన పురుషుడు కనిపిస్తున్నాడు. అతనికి

చక్కగా నిండైన నీటిలో పుట్టిన, బలమైన కాడను కల, సూర్యుని కిరణాల వల్ల వికసించిన తామరపూవువంటి నేత్రాలను రెండింటిని కలిగి ఉన్నాడు) అనే శ్రుతివాక్యంలో ఆ జగత్కారణ వస్తువైన పురుషుడు ఆదిత్య మండలంలో ఉంటాడని చెప్పినట్లయినది.

ఇక ఈ పుండరీకాక్షుడైన పురుషుడు నారాయణుడే అని నిరూపించబడుతున్నది. శివపురాణంలో– నారాయణుడు ప్రతిదినం వేయి తామర పుష్పాలతో శివుని అర్చించినట్లు, ఒకనాడు అతని భక్తిని పరీక్షించాలని తలచి శివుడు ఒక తామర పువ్వు కనిపించకుండా చేసినట్లు, అపుడు నారాయణుడు పుండరీకాక్షుడు అయినందున, తామరపూవువంటి తన కంటితో శివుని అర్చించినట్లు, అందువల్ల శివుడు ఆనందించి నారాయణకు చక్రాన్ని ఇచ్చినట్లు చెప్పబడిననందున, పుండరీకాక్షుడు నారాయణుడే అనే విషయం ఇతరమతంలో కూడా అంగీకరింపబడినట్లయినది.

"ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మ నేశానః" (సృష్టికి ముందు నారాయణుడు ఒక్కడే ఉన్నాడు. బ్రహ్మ లేడు, శివుడు లేడు) అనే శ్రుతివాక్యంలో బ్రహ్మ, పరమశివుడు పుట్టడానికి ముందే నారాయణుడు ఒక్కడే ఉన్నాడని చెప్పబడినందున, "యథా శంకరశబ్దోఽయం మహాదేవేఽవతిష్ఠతే, తథా పురుషశబ్దోఽయం వాసుదేవేఽవతిష్ఠతే" (శంకర అనే శబ్దం శివుని మాత్రమే చెప్పేటట్లే నారాయణశబ్దం కూడా వాసుదేవుని మాత్రమే తెలుపుతున్నది) అని చెప్పబడినందున జగత్కారణ వస్తువై ఉండే పురుషుడు నారాయణుడే– అనే విషయం స్పష్టం అవుతున్నది. జగత్తుకు కారణమై ఉండే తత్వమే పరతత్వం అనేది ఉపనిషత్తులలోని సిద్ధాంతం. ఈ విధంగా పూర్వం నిరూపింపబడిన రీతిలో నారాయణుడే పరతత్వం–అనేది ఉపనిషత్తులను చక్కగా పరీక్షించినప్పుడు స్పష్టంగా తెలుస్తున్నదికదా!

ఇంక, దివ్యసూరిసూక్తులలో కూడా ఇదే విషయం ప్రతిపాదించబడినది–అనే సంగతి ఇక నిరూపింపపబడుతున్నది. భగవంతునిలో – జగత్కారణవస్తువై ఉండడం, భక్తికి విషయమై ఉండడం, దయను చూపించేవాడై ఉండడం–అనే మూడు ధర్మాలు ఒక దానిని విడిచి ఇంకొకటి ఉండని రీతిలో కలసి ఉన్నాయి. ఈ మూడు ధర్మాలలో ఒకటి మాత్రం

చెప్పబడి మిగిలినవి రెండు చెప్పబడకపోయినా, చెప్పబడిన ఆ ధర్మం మిగిలిన రెండు ధర్మాలను, వాటి మధ్య ఉండే అవినాభావ సంబంధంచేత, వాటికి సూచకమవుతున్నది. నమ్మాళ్వారులు."మయర్వఱ మదినలమ్ అరుళినన్ "(సంశయభ్రమవిపర్యాసాదిదోషాలు ఏమీ లేని రీతిలో సహజమైన, భక్తిరూపంలో పరిణమించిన జ్ఞానాన్ని అనుగ్రహించాడు) అని తిరువాయ్ మొళ్ఴి ప్రబంధప్రారంభంలో పలికినందున "భగవంతుడు దయను చూపించేవాడు" అని స్పష్టంగా తెలుస్తున్నది. ఈ ధర్మం భక్తికి విషయమై ఉండడం, కారణ వస్తువై ఉండడం–రెండు ధర్మాలతో కలసి ఒకే తత్త్వంలో ఉంటుంది కనుక, భగవానునకు సంబంధించిన ఆ రెండు ధర్మాలకు, అంటే, భక్తికి విషయమై ఉండడం, కారణవస్తువై ఉండడం–అనే రెండు ధర్మాలకు సూచకం అవుతున్నది. అందుచేత "కారణం తు ధ్యేయః" అనే శ్రుత్యర్థాన్ని "మయర్వఱ మదినలమరుళినన్" అనే ఆళ్వారుల సూక్తి సూచిస్తున్నది – అనే విషయం స్పష్టం.

"మయర్వఱ మదినలమ్" అనే సూక్తిలో అజ్ఞానం నశించేటట్లు, జ్ఞానాన్ని, ప్రేమను తన కృపతో అనుగ్రహించినవాడు, భగవంతుడు–అనిచెప్పబడినందున, మోక్షానికి కారణం అతడే–అనే విషయం కూడా ఇక్కడ స్పష్టంగా చెప్పబడింది.. "అవిద్యానివృత్తిరేవ మోక్షః" అని అజ్ఞాననాశనమే మోక్షమని వేదాంతంలో చెప్పబడినది. ఆ మోక్షం "జగదుద్భవ స్థితి ప్రణాశసంసారవిమోచనాదయః" అనే శ్రీయామునుల సూక్తిరీతిలో జగత్తుయొక్క సృష్టి స్థితి సంహారాలు బ్రహ్మకార్యాలై ఉన్నట్లే, సంసార విమోచనంకూడా బ్రహ్మకార్యమని ఈ శ్రీసూక్తి తెలుపుతున్నది. అందువల్ల సంసార విమోచనం బ్రహ్మకార్యం అనేది కూడా ఇక్కడ స్పష్టం. "కడల్ ఞానమ్ శెయ్ దేనుమ్ యానే యెన్నుమ్, కడల్ ఞానమావేనుమ్ యానే యెన్నుమ్" (సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ జగత్తును సృష్టించిననవాడను నేనే, ఆ జగత్తుకు అంతరాత్మనైయై ఉండేవాడనుకూడా నేనే) అనే పాశురంలో నమ్మాళ్వారులు "ఆహం మనురభవం సూర్యశ్చ" (నేను సూర్యుడను అయ్యాను, మనువును అయ్యాను) అని, "తద్భావభావమాపన్నః తతోఽసౌ పరమాత్మనా భవత్యభేదీ'" (ఆ పరమాత్మయొక్క భావాన్ని పొందినవాడు అయినందున, భక్తుడు పరమాత్మతో అభేద భావాన్ని పొందుతున్నాడు) అని, "మత్తః సర్వమహం సర్వమ్" (అంతా నేనే,నా వల్లనే

అంతా పుడుతున్నది) అని చెప్పినట్లుగా, భావనాప్రకర్షచేత తనను పరమాత్మగా భావించి, "జగత్సృష్టి మొదలైనవానిని చేసినవాడను నేనే" అని భగవానుని మాటలతో పలికినందున," యతో వా ఇమాని భూతాని జాయంతే" అని శ్రుతిలో చెప్పబడిన కారణవస్తువు బ్రహ్మం–అనే అర్థం ఇక్కడ స్పష్టంగా చెప్పబడినట్లయింది.

"మననకమ్" అనే పాశురంలో "పొఱియుణర్ వవైయిలన్" (ఇంద్రియాలవల్ల కలిగే జ్ఞానానికి అందేవాడు కాడు) అని,"మననుణర్ వవైయిలన్" (మానస జ్ఞానానికి అందేవాడు కాడు) అని సంపూర్ణమైన జ్ఞానానందాలతో నిరూపించదగినవాడు) అని అన్నందున , "తద్రైక్షత", "ఆనందమయః" అనే వాక్యాల వల్ల తెలియబడే చేతనాచేతనవిశిష్టుడు భగవంతుడు – అనేది స్పష్టం.

"ఒన్ఱుమ్ తేవుమ్ ఉలకుముయిరుమ్ మఱ్ఱుమ్ యాదుమిల్లా అన్ఱు నాన్ముకన్ తన్నొడు తేవరులకోడు ఉయిర్ పడైత్తాన్"( బ్రహ్మాదిదేవతలు, ఈ లోకంలోని జీవులు, ఇంకా, ఏమీ లేని సృష్టిప్రారంభంలో చతుర్ముఖబ్రహ్మ, దేవతలు మొదలైన అందరిని నారాయణుడు సృష్టించాడు) అనే నమ్మాళ్వారుల సూక్తిలో "తమః పరే దేవ ఏకీభవతి" అనేవిధంగా రూపంలో ఒకటి అనేటట్లుగా లయించిన దేవజాతి, వారికి నివాసస్థానాలు అయిన లోకాలు, మనుషులు మొదలైన జీవవర్గం, సమష్టీ రూపమైన మహదాదులు మొదలైన సకల పదార్థాలు అన్నీ నామరూపరహితాలుగా ఉండడం గమనించిన భగవంతుడు, సకల పదార్థాలు లయమైన ఆ కాలంలో వీటి సృష్టి యోగ్యతను అనుసంధించడంచేత వాటి విషయంలో దయ కలిగినవాడై, సమష్టిపురుషుడైన బ్రహ్మతో పాటు దేవతా వర్గాన్ని, లోకంలోని ప్రాణికోటిని, మిగిలిన అన్నిటిని సృష్టించాడు–అని చెప్పినందున ఇక్కడ "ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మ , నేశానః, నేమే ద్యావాపృథివీ" (సృష్టి ఆరంభంలో నారాయణుడు ఒక్కడే కదా ఉన్నాడు. బ్రహ్మ లేడు, ఈశ్వరుడు లేడు, ఈ భూమి, ఆకాశం ఏమీ లేవు) అనే శృతివాక్యంలోని అర్థాన్ని స్పష్టంగా గమనించవచ్చు.

"తకుమ్ శీర్ త్తన్ తనిముదలినుళ్ళే మికుమ్ తేవుమ్ ఎప్పొరుమ్ పడైక్కత్తకుమ్ కోల త్తామరైక్కణ్ణన్ ఎమ్మాన్ మికుమ్ శోది మేలఱివార్ యవరే" అనే పాశురంలో అందమైన తామరపూవువంటి కన్నులను కలిగిన నా స్వామికంటే గొప్ప

పరంజ్యోతిస్సు, ఇంకొక పరతత్త్వం ఉన్నదని భావించే వైదికులలో విజ్ఞులైనవారు ఎవరు ఉన్నారు? అని చెప్పబడినందున "తస్య యథా కప్యాసం పుండరీకమేవమక్షిణీ" అనే వేదవాక్యంలోని అర్థాన్ని గమనించవచ్చు.

ఈ విధంగా జగత్తుకు కారణతత్వమై, పుండరీకాక్షుడై, పురుషోత్తముడై ఉండే శ్రీమంతుడైన నారాయణుడే గొప్ప తత్వం అనే విషయం ఉభయవేదాంతాలలో సమానంగా తెలుపబడింది–అనే విషయం సంగ్రహంగా నిరూపింపబడినది.

**హితం:** ఇక, ఆ భగవంతుడే హితం (తగిన ఉపాయం) అనే విషయం తెలుపబడుతున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తులో "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వైవేదాంశ్చ ప్రహిణోతి తస్మై, తం దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే" (సృష్టి ఆరంభంలో ఏ పరమాత్మ బ్రహ్మను సృష్టించి, ఆ బ్రహ్మకు వేదాలను అనుగ్రహించాడో, ఏ పరమాత్మ అనుగ్రహంవల్ల అతడే ఉపాయం అనే స్పష్టమైన జ్ఞానం కలుగుతుందో, ఆ సర్వేశ్వరుడైన దేవుని నేను ఉపాయంగా ఆశ్రయిస్తున్నాను) అని చెప్పబడినందున భగవంతుడే ఉపాయం అనే విషయం ఉపనిషత్తులలో స్పష్టంగా తెలుపబడింది.

ఈ అర్థాన్ని నమ్మాళ్వార్లు "ఎన్నుణర్విను ళ్ళే యిరుత్తినేన్ అదువుమ్ అవనదు ఇన్నరుళే" (ఆ పరమాత్మను నా మనసులో నిలుపుకున్నాను. ఆ విధంగా నిలుపుకోగల్గడానికి కారణం కూడా అతని కృపయే) అనే చోట స్పష్టం చేసినందున భగవంతుడే పరమహితం–అనే విషయం ఉభయవేదాంతాలలో ఒకే విధంగా తెలుపబడింది.

**పురుషార్థం:** ఇక, ఆ పరమపురుషార్థంగా చెప్పబడే పరమాత్మకైంకర్యానిగూర్చి ఉభయవేదాంతాలు ఏ విధంగా తెలుపుతున్నాయి? అనే విషయాన్ని గమనిద్దాం. "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా" అనే వేదవాక్య పరమపదంలో భగవంతుని కృపకు పాత్రుడైన జీవుడు సర్వజ్ఞుడైన ఆ పరమాత్మతో కలసి అతని కళ్యాణగుణాలను అనుభవిస్తున్నాడు–అని భగవంతుని కళ్యాణగుణానుభవం పరమపురుషార్థంగా చెప్పబడింది. సాటి లేని భగవంతుని కల్యాణగుణాలను జీవుడు అనుభవించేటప్పుడు ఆ జీవునకు కల్యాణగుణాలు కల భగవంతుని విషయంలో గొప్ప ప్రీతి కలుగుతున్నది. ఆ ప్రీతిచేత ప్రేరేపించబడినవాడైన

జీవుడు ఆ పరమాత్మకు సేవ చేస్తున్నాడు. ఈ సేవయే కైంకర్యమని చెప్పబడుతున్నది. కైంకర్యం అంటే–భగవంతుని ముఖానికి ఉల్లాసాన్ని కలిగించే వ్యాపార విశేషం. భగవంతుని దగ్గరకు వెళ్లడం, అతని సేవించడం, అతని కల్యాణగుణాలను అనుభవించడం–అనే వీటిని పలు విధాలుగా తెలిపే వేదవాక్యాలకు భగవత్ కైంకర్యపర్యంతమైన పురుషార్థాన్ని తెలుపపడంలో దృష్టి ఉన్నది గనుక, శ్రీ వైష్ణవసంప్రదాయంలో భగవత్ కైంకర్యమే పరమపురుషార్థంగా చెప్పబడుతున్నది.

"ఉకన్దు పణి శెయ్ దు ఉన పాదమ్ పెఱ్ఱేన్ " (నిన్ను సేవించినపుడు కలిగిన ప్రీతిచేత ప్రేరేపింపబడినవాడనై, నీకు వాచికమైన సేవలను చేసి, పరమప్రాప్యభూతమైన నీ శ్రీచరణాలను పొందాను) అని, "ఈదే ఎన్నుమ్ వేణ్డువదు ఎన్దాయ్!" (ఈ కైంకర్యమేనా ఆత్మ ఉన్నంతవరకు నాకు అపేక్షితం, నాకు నిరుపాధిక బంధువైన ఓ స్వామీ!) అని నమ్మాళ్వారులు పలికినందున ద్రవిడోపనిషత్తులకూడా భగవత్కైంకర్యమే పరమ పురుషార్థంగా చెప్పబడింది – అని తెలియవచ్చు.

ఈ విధంగా ఉభయవేదాంతాలు తత్త్వ–హిత–పురుషార్థాలను సమానంగా ప్రతిపాదిస్తున్నాయి–అనే విషయం సంగ్రహంగా నిరూపింపబడింది. సంస్కృతవేదానికి, తిరువాయ్ మొళ్ళి ప్రబంధానికి మధ్య ఇటువంటి అర్థసామ్యాలు ఇంకా చాలా ఉన్నాయి. కాని, విస్తరభయంవల్ల ఇంతటితో ఈ వ్యాసం ముగింపపబడుతున్నది.

**తత్త్వోపాయఫలస్వరూపవిషయే వేదాంతయుగ్మోక్తిషు**
**స్పష్టం భాతి సరూపతా సకల పూర్వాచార్యసందర్శితా ।**
**యా తామేవ బహుప్రమాణవచనైః సమ్యక్ వివృణ్వన్నిహ**
**లేఖం వేంకటదేశికో వితనుతే కంచిత్ విదాం రంజకమ్ ।।**

# ఆదిశేషావతారాలు

**(ఉ. వే శ్రీమాన్ తిరుమలై అనందాణ్ పిళ్ళై కృష్ణమాచార్యస్వామివారి ద్రావిడవ్యాసం ఆధారంగా)**

"అజాయమానో బహుధా విజాయతే' (భగవంతుడు కర్మలవల్ల పుట్టనివాడైనా, భగవంతుడు కృపకారణంగా పలు రీతులలో పుడుతున్నాడు), "స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" (భగవంతుడు అవతరించినప్పుడే మిక్కిలిగా ప్రకాశిస్తున్నాడు) అని వేదం, " పిఱప్పిల్ పల్ పిఱవి ప్పెరుమాన్" అని ,"పల పిఱప్పాయ్ ఒళివరు ముழுనలమ్" అని వేదాన్ని ద్రావిడీకరించిన శఠకోపులు పలికిన రీతిలో పరమ పురుషుడైన శ్రీమన్నారాయణుడు పుణ్య పాపాలనే కర్మల కారణంగా జన్మించే మనవలె జన్మించకుండా, "ఉయరళిప్పాన్ ఎన్నిన్ల యోనియుమాయ్ పిఱన్దాయ్ "(తిరువిరుత్తమ్) (జీవులను అనురక్షించడం కోసం నువ్వు ఎన్ని జాతులలో జన్మించావో కదా) అనే విధంగా జీవులను రక్షించడం కోసం ఎన్నో అవతారాలను తన కృప కారణంగా ఎత్తడం, జన్మించే కొద్దీ పాపాలను పేర్చి పెంచుకొని, తేజస్సును కోల్పోయే మనవలె కాకుండా, అవతారాలు ఎత్తే కొద్దీ సౌలభ్యం, సౌశీల్యం, వాత్సల్యం మొదలైన తన కల్యాణ గుణాలను వ్యక్తం చేస్తూ, వాటివల్ల మరింత కాంతిని పొందడం ఆదిశేషుడు గమనించాడు.

"నివాసశయ్యాసనపాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః" (స్తోత్రరత్నమ్–40) (నివాసంగా, శయ్యగా, ఆసనంగా, దిండుగా, గొడుగుగా పలు అవతారాలను ఎత్తి, ఆదిశేషుడు భగవంతునకు సేవ చేస్తున్నాడు. అందువల్ల అతడు శేషుడనే పేరుతో పిలువబడుతున్నాడు) అనే విధంగా ఆయా సమయాలకు, సన్నివేశాలకు తగిన రీతిలో భగవంతునకు తాను చేసే కైంకర్యాలకు తగిన పలు రూపాలను పొందడంవల్ల శేషుడని అందరి చేత పిలువబడే ఆదిశేషుడు "భగవంతునివలె తాను కూడా మాటిమాటికి అవతరించి, తన శేషత్వానికి తగిన కళ్యాణ గుణాలను వ్యక్తం చేసి, గొప్పగా ప్రకాశించాలి"– అని తలచి, లక్ష్మణుడు, బలరాముడు, రామానుజులు, అనంతార్యులు, శ్రీవరవరమునులు అనే పేర్లతో అవతరించి, భగవంతుని రామకృష్ణాది అవతారాలలోను, శ్రీరంగం తిరుమల మొదలైన దివ్య దేశాలలో ప్రకాశించే

అర్చారూపాలలోను అభినివేశాన్ని పొంది, కైంకర్యాలను చేసి - భగవంతుడు, ఆచార్యుడు అనే వీరి పట్ల భక్తి, పారతంత్ర్యం మొదలైన శేషత్వానికి తగిన గుణాలతో ప్రకాశించాడు–అనేది పూర్వ గ్రంథాలలో ప్రసిద్ధంగా వ్యక్తమవుతున్నది. ఈ విషయాన్ని కొంచెం వివరంగా గమనిద్దాం.

భగవానుడు త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడై అవతరించినప్పుడు ఆదిశేషుడు అతనికి తమ్ముడైన లక్ష్మణుడుగా అవతరించి, బాల్యంనుండి ఆ రాముని విషయంలో ప్రేమను కలవాడై, భవనవాసంలోను, వనవాసంలోను తేడా లేకుండా రామునకు చేయవలసిన సేవలను చాలా శ్రద్ధగా చేయడంద్వారా తన శేషత్వాన్ని వ్యక్తం చేసి ప్రకాశించాడు–అనే విషయం శ్రీరామాయణంలో ప్రసిద్ధమైనదే. సీతాదేవి రెండు పర్యాయాలు శ్రీరాముని విశ్లేషించిన సమయంలో కూడా లక్ష్మణుడు శ్రీరాముని విడవకుండా అతని వెంటనే ఉండి, కైంకర్యాన్ని చేసిన విషయం ఇక్కడ గమనించదగినది.

ఆ విధంగానే భగవంతుడు ద్వాపరయుగంలో కృష్ణుడై అవతరించినప్పుడు, ఆదిశేషుడు బలరాముడుగా అవతరించాడు. కాళీయుని గర్వాన్ని అణచిన సమయంలో తప్ప మిగిలిన అన్ని సమయాలలో శ్రీకృష్ణుని వెంట ఉండి అతనిని రక్షించాడు. కాళీయుని తలపై కృష్ణుడు నాట్యం చేసిన సమయంలో అతడు బలరాముని విడచి ఒంటరిగా వెళ్ళినట్టు శ్రీవిష్ణుపురాణం తెలుపుతున్నది. "ఏకదా తు వినా రామం కృష్ణో బృందావనం యయౌ" (శ్రీవిష్ణుపురాణమ్–5–7) (ఒకసారి బలరాముని విడచి శ్రీ కృష్ణుడు ఒంటరిగా బృందావనానికి వెళ్ళాడు) అని ఆరంభించి కాళీయుని గర్వాన్ని అణచిన కథ అందులో తెలుపబడింది. ఇంతేకాక, శ్రీకృష్ణునకు, గోపికలతో ప్రణయ కలహం సంభవించిన సందర్భంలో శ్రీకృష్ణుడు గోపికలకు పంపిన దూత్యాన్ని వారికి తెలియజేసి, వారిని ఊరడించిన విషయం కూడా శ్రీవిష్ణుపురాణం తెలుపుతున్నది. "సందేశైః సామమధురైః ప్రేమగర్భైరగర్వితైః, రామేణాశ్వాసితా గోప్యః కృష్ణస్యాతిమనోహరాః"( 5–24–20) (ఆశ్వాసాన్ని కలిగించేవి, తీయనివి, ప్రేమను తనలో కలిగినవి, గర్వంతో కూడి ఉండనివి, వినేవారి మనస్సును దోచేవి, శ్రీకృష్ణుడు గోపికలకు పంపినవి అయిన బలరాముని దౌత్యవచనాలను విని, గోపికలు కృష్ణుని పట్ల తమకు గల కోపాన్ని పోయినవారై, ప్రేమను నిండినవారయ్యారు) అనే వచనాలను ఇక్కడ

గమనించాలి. ఈ విధంగానే బలరాముడు తన తమ్ముడైన శ్రీకృష్ణునకు పలు విధాలుగా సేవలు చేశాడు. శ్రీరామునకు తమ్ముడై అవతరించిన లక్ష్మణుని వలె కాకుండా, బలరాముని రూపంలో ఆదిశేషుడు శ్రీకృష్ణునకు అన్నగా అవతరించి, తన తమ్మునకు సేవ చేసిన విషయం ఆదిశేషునకు మరింత ప్రకాశాన్ని కలిగిస్తున్నది కదా.

ఆ ఆదిశేషుడు కలియుగంలో భగవద్రామానుజులుగా అవతరించి, "తెన్నరఙ్గర్ శెల్వమ్ ముఱ్ఱుమ్ తిరుత్తివైత్తాన్ వాళియే"( ఆర్తిప్రబంధమ్–31) (శ్రీరంగనాథుని సంపదను అంతటిని సంస్కరించిన శ్రీరామానుజులకు మంగళం) అనే విధంగా శ్రీరంగనాథుని సమస్తమైన ఐశ్వర్యాన్ని అభివృద్ధి చేసి, శ్రీవేంకటేశ్వరునకు శంఖచక్రాలను సమర్పించి, ఆ భగవానునకు పురాణాలలో చెప్పబడిన విష్ణురూపాన్ని లోకానికి తెలియజెప్పి, కాంచీపురంలోని వరదరాజ స్వామికి 'శాలక్కిణఱు' అనే బావినుండి ఆ స్వామి ఆరాధనకు కావలసిన జలాన్ని తీసికొనివచ్చి సమర్పించడమే కాక, ఆ స్వామిని తమ ఆరాధనలోని మూర్తిగా చేసికొని, యదుగిరిలోని తిరునారాయణ స్వామి అనే మూలమూర్తిని పుట్టనుండి బయటకు తీయించి, ఢిల్లీ నగరంలో మరుగున పడి ఉన్న ఉత్సవమూర్తి శెల్వప్పిళ్ళైను తమ మహిమతో తీసుకొని వచ్చి, మూలమూర్తితో కలిపి ప్రతిష్ఠ చేయించి–ఈ విధంగానే పలుచోట్ల పలు అర్చామూర్తులకు సేవ చేసిన విషయం ఆఱాయిరప్పడి, గురుపరంపరాప్రభావం మొదలైన గ్రంథాలలో చూడవచ్చు. విభవ రూపాలైన రామకృష్ణాది అవతారాలలో భగవానుని వెంట జన్మించి సేవ చేసిన లక్ష్మణ, బలరాముల కంటే, విభవావతారాల కంటే అతిశయాన్ని కల అర్చారూపాలకు సేవ చేసిన శ్రీరామానుజుల గొప్పతనం మరింత ఎక్కువ కదా.

శ్రీరామానుజులై అవతరించడంతో తృప్తి పడకుండా, ఆ రామానుజులకు శిష్యుడై , తిరుమలై అనంతాళ్వాన్ గా ఆదిశేషుడు అవతరించాడు. తన ఆచార్యులైన శ్రీరామానుజుల అజ్ఞను అనుసరించి తిరుమలకు వెళ్లి, అక్కడ చెరువును తవ్వి, తోటను పెంచి - మాలా కారుడు, పెరియాళ్వార్లు, తొండరడిప్పొడి ఆళ్వారులవలె భగవానునకు మాలాసమర్పణ కైంకర్యాన్ని చేయగోరి, వేంకటేశ్వరునకు ప్రతిదినం పుష్పమాలికలను కట్టి సమర్పించేవారు. ఆ సమయంలో ఒకనాడు పూలమాలలను కట్టేటపుడు వేంకటేశ్వరుని వద్ద నుండి

ఒక భక్తుడు వచ్చి, అనంతార్యులను వేంకటేశ్వరుడు  ఒకసారి వచ్చి వెళ్ళమన్నాడని తెలియజేశారు. అప్పుడు అనంతార్యులు ఆ ఆజ్ఞను లెక్కపెట్టకుండా, శ్రీరామానుజుల ఆజ్ఞనే తలచి, మాలను కట్టే పనిలోనే నిమగ్నులయ్యారు. ఈ విషయం 'గురుపరంపరా ప్రభావం' మొదలైన గ్రంథాలలో తెలుపబడింది. భగవత్సేవను చక్కగా చేసినప్పటికీ, తమ ఆచార్యులైన తిరుక్కోట్టియూర్ నంబి ఆజ్ఞను కాదని, ఆశ కలిగినవారికి అందరికీ చరమశ్లోకంలోని అర్థాలను  ఉపదేశించిన రామానుజుల గొప్పదనం కంటే, తమ ఆచార్యులైన రామానుజుల ఆజ్ఞను ప్రధానంగా తలచి, దానిని  దాటకుండా భగవంతుని సేవలోనే నిమగ్నులైన అనంతార్యుల గొప్పతనం ఇంకా గొప్పదికదా.

ఈ విధంగా నాలుగు సార్లు అవతరించి, గొప్ప ప్రకాశాన్ని పొందినా చాలదని తలచిన ఆదిశేషుడు అంతు లేని ప్రకాశాన్ని పొందడకోసం చివరిగా శ్రీవరవరమునులుగా అవతరించాడు.  సముద్రంవలె అంతు లేని జ్ఞాన, భక్తి, వైరాగ్యాలకు ఆకరమైనవారని, శ్రీరామానుజుల చరణాలలో భక్తిని కలవారని, అందరు పొగడే  రీతిలో తమ ఆచార్యులైన తిరువాయ్ మొళ్ళి పిళ్లై కృపకు పాత్రులైనవారైన మణవాళ మహాముని శ్రీరంగంలో తమను శరణు పొందినవారికి తత్వార్థాలను ఉపదేశించి, శ్రీరంగనాధునకు కైంకర్యాలను చేశారు. "తిరువాయ్ మొళ్ళి ప్రబంధంతోనే కాలం గడపండి, వాటిలోని అర్థాలను ప్రచారం చేయడంలోనే ఆసక్తిని కలిగి ఉండండి" అనే తమ ఆచార్యుల ఆజ్ఞను కొంచెం కూడా దాటకుండా, తమ కాలాన్నితిరువాయ్ మొళ్ళి అనుసంధానంలో చాలా మధురంగా గడిపేవారు. ఆ సమయంలో ఒక నాడు శ్రీరంగనాథుడు తమను తన ఆచార్యునిగా వరించి, "రేపటినుండి మీరు మాకు తిరువాయ్ మొళ్ళి ప్రబంధానికి కల ఈడు వ్యాఖ్యానాన్ని ఒక సంవత్సర కాలంపాటు గరుడమండపంలో ప్రవచించాలి"  అని అర్చక ముఖంగా ఆజ్ఞ ఇవ్వగా, ఆ ఆజ్ఞను శిరసా వహిస్తూ, శ్రీవరవరములు తమ ఆచార్యుల ఆజ్ఞను స్మరిస్తూ, "సర్వజ్ఞుడైన శ్రీరంగనాథుడు శిష్యుడయ్యాడట.  అల్పజ్ఞుడనైన నేను ఆచార్యుడట, ఇది చాలా బాగుంది, నావల్ల కాదు" అని ఆ  ఆజ్ఞను అలక్ష్యం చేయకుండా, "భోగదశైయిల్ ఈశ్వరన్ అళికుక్కమ్ పోదు నోక్కవేణుమెన్ను అళియాదొళికై" ( భగవంతుడు భోగదశలో శేషశేషి భావాన్ని తారుమారు చేసి, తాను ఆనందాన్ని అనుభవించాలని చూచినప్పుడు భక్తుడు తన శేషత్వాన్ని ప్రధానంగా భావించి, భగవంతుని ఆ ఆనందానికి అడ్డు రాకూడదు)

అనే శ్రీపిళ్ళైలోకాచార్యులవారి సూక్తి రీతిలో, "స్వతంత్రుడైన శ్రీరంగనాథుడు తనను శేషంగా చేసుకొని ,నన్ను శేషిగా చేసికొని ఆనందాన్ని పొందాలని తలచిన ఈ తరుణంలో నా శేషత్వాన్ని కాపాడుకోవాలని ప్రయత్నించి ఆ స్వామి ఆనందానికి అడ్డు కాకూడదు. అతని సంకల్పాన్ని అనుసరించాలి" అని తమ అత్యంతశేషత్వమనే స్వరూపానికి తగినట్లే అతని మాట ప్రకారం శ్రీరంగనాథునకు ఈడు వ్యాఖ్యానాన్ని ఒక సంవత్సరం పాటు ప్రవచించారు"– అని శ్రీయతీంద్రప్రవణ ప్రభావం మొదలైన గ్రంథాలలో తెలుపబడింది. ఈ విధంగా తనకు ఈడు వ్యాఖ్యను ప్రవచించిన శ్రీవరవరమునులకు శ్రీరంగనాథుడు "శ్రీశైలేశ దయాపాత్రమ్" ఇత్యాది తనియన్ శ్లోకాన్ని సమర్పించినట్లు కూడా ఆ గ్రంథాలలో తెలుపబడినది. శ్రీరామానుజులు తమ ఆచార్యులైన తిరు కోట్టియూర్ నంబి ఆజ్ఞను మీరడం, ఆ విధంగానే అనంతార్యులు శ్రీ వేంకటేశ్వరుని మాటను మీరడం–అనే ఇవి దోషాలు అవునో కాదో.. ఆ విషయం పక్కన ఉంచితే, భగవానుడైన శ్రీరంనాథుని, ఆ విధంగానే, ఆచార్యులైన తిరువాయ్ మొழி ప్పిళ్ళై ఆజ్ఞను అనుసరించి వర్తించిన మణవాళ మహామునులలో పైన తెలిపిన దోషాలు ఉన్నాయేమో!అనే శంకకు కూడా అవకాశం లేదు. అందువల్ల శ్రీరామానుజులు, అనంతార్యులు–అనే వీరిద్దరి మహిమ కంటే గొప్ప మహిమను శ్రీవరవరమునులు కలిగినవారై, వారిద్దరి కంటే గొప్పగా ప్రకాశిస్తున్నారు–అనే విషయాన్ని వేరే చెప్పనక్కరలేదు కదా.

ఈ విధంగా ఆదిశేషుని అవతారాలుగా చెప్పబడే ఈ అయిదు అవతారాలలో, శ్రీవరవరమునులు మిగిలిన నలుగురికంటే ఎక్కువ మహిమను కలవారు అయినందున పెరియ జీయర్ అనే పేరుతో ప్రకాశిస్తున్నారు. భగవంతుడు అంతు లేని అవతారాలను ఎత్తినా శ్రీవరవరమునులు పొందినంత ప్రకాశాన్ని పొందాడని చెప్పలేము. ఆ భగవానునకే వరవరమునులు ఆచార్యుల అయ్యారు కదా. అతనితో పోటీపడిన ఆదిశేషుడు మాత్రం అయిదు అవతారాలలోనే ఇకపై అవతరించనక్కరలేని రీతిలో చాలా గొప్ప, నిండయిన మహిమను, కీర్తిని పొందాడనేది పెద్దల సూక్తి.

ఇక ,ఈ ఐదుగురు ఆదిశేషుని అంశతో జన్మించారు–అనే విషయాన్ని ఋజువు చేసే కొన్ని ప్రమాణాలను గమనిద్దాం:

1) "సాక్షాదనంత స్స గిరిః సర్వదా సేవతే హరిమ్, లక్ష్మణాకృతిమాస్థాయ త్రేతాయామప్యసేవత" ( ఆదిశేషుడే యాదవగిరి రూపాన్ని పొంది, ఎల్లప్పుడు ధరిస్తున్నాడు ,సేవ చేస్తున్నాడు. త్రేతా యుగంలో కూడా అతడు శ్రీరామునకు తమ్ముడైన లక్ష్మణునిగా జన్మించి, అతనికి సేవ చేశాడు ) అని మొదలైన ప్రమాణాలలో చెప్పబడినందున "లక్ష్మణుడు ఆదిశేషుని అంశతో జన్మించాడు" అనే విషయాన్ని తెలియవచ్చు.

2) "దేవక్యాః జఠరే గర్భం శేషాఖ్యం ధామ మామకమ్, తత్ సన్నికృష్య రోహిణ్యా ఉదరే సన్నివేశయః" (నా తేజస్సు, ఆదిశేషుడనే పేరును కలిగినది, దేవకి ఉదరంలో ఉండేదైన అయిన గర్భాన్ని తీసుకొనిపోయి రోహిణి గర్భంలో ప్రవేశపెట్టు)అని శ్రీకృష్ణుడిగా నిర్మించబోయే భగవంతుడు యోగమాయను అజ్ఞాపించినందున రోహిణి పుత్రుడైన బలరాముడు ఆదిశేషుని అవతారం అనేది స్పష్టమవుతున్నది.

3) "భౌజంగం వపు రపహాయ శేషభోగ యద్రూపం త్రిభువననందితం చకార"(దివ్యసూరి చరితం –17–7) (ఆదిశేషుడు ముల్లోకాలు భయపడే సర్పరూపాన్ని విడిచి, ముల్లోకాలు ఆనందించే రామానుజుల రూపాన్ని ధరించాడు) అని రామానుజుల శిష్యుడైన గరుడ వాహనపండితుడు శ్రీరామానుజుల అవతారాన్ని గూర్చి పలికినందున శ్రీరామానుజులు ఆదిశేషుని అవతారంగా తెలుస్తున్నది.

4) అనంతార్యులు తిరుమలలో తాము పెంచిన ఉద్యానవనంలో పూలను కోసేటప్పుడు వారి చేతిని ఒక పాము కరిచింది. ఆ విషాన్ని పోగొట్టుకోవాలని వారు ప్రయత్నించకుండా, మళ్ళీ స్నానం చేసి పూర్వంవలె పూలమాలను కట్టడానికి ఆరంభించారు. శ్రీవేంకటేశ్వర్లు అప్పుడు వారితో "విషాన్ని తీర్చుకోవడానికి మీరు ఎందుకు ప్రయత్నించలేదు?" అని ప్రశ్నించగా "కరువబడిన పాము బలమైనది అయితే స్వామి పుష్కరిణిలో స్నానం చేసి శ్రీవేంకటేశ్వరుని రూపంలో ఉండే నిన్ను సేవిస్తాను. ఆ విధంగా కాక, కరిచిన పాము బలమైనది అయితే విరజానదిలో స్నానం చేసి, పరమపదనాథుని సేవిస్తాను" అని తమ మనోనిశ్చయాన్ని చెప్పినపుడు తమను "కరువుబడిన పాము" అని నిర్దేశించుకున్నట్లు

ఆఱాయిరప్పడి, గురుపరంపరా ప్రభావం మొదలైన గ్రంథాలలో తెలుపబడినందున అనంతార్యుడు శేషావతార రూపులు అనేది స్పష్టం.

5) చివరిగా మణవాళ మహాములు ఆదిశేషుని అవతారం–అనే విషయం, శ్రీరంగనాథుడు ఉత్తమనంబికి కలలో కనిపించి ,"నంబీ! ఈ ఆదిశేషుడే శ్రీవరవర మునిగా అవతరించాడు సుమా" అని తెలిపినట్లు యతీంద్రప్రవణప్రభావం మొదలైన గ్రంథాలలో ఉన్నందున, తెలియవచ్చు.

ఈ అయిదుగురు ఈ విధంగా ఆదిశేషుని అంశతో జన్మించారు–అనే విషయాన్ని నిరూపించే ప్రమాణాలు ఇంకా పలు గ్రంథాలలో ఉన్నాయి. అయితే, ఇక్కడ క్లుప్తంగా మాత్రమే ఈ విషయం ప్రస్తావించ బడింది.

# జీయర్ శబ్దార్థం

**(ఉ. వే శ్రీమాన్ తిరుమలై అనందాణ్ పిళ్ళై కృష్ణమాచార్యస్వామివారి ద్రావిడవ్యాసం ఆధారంగా)**

జీయర్ అనే పదం శ్రీ వైష్ణవ సంప్రదాయంలో గృహస్థులు, సన్యాసులు అనే తేడా లేకుండా పూర్వం పెద్దలందరి విషయంలో వ్యవహరింపబడేది. ఇప్పుడు ఈ పదం గృహస్థులను నిర్దేశించే టప్పుడు వ్యవహరింపబడకపోయినా, పూర్వం ప్రయోగంలో ఉండేది–అనే విషయం "మాఱనేర్ నంబి విషయమాక పెరియనంబి ఉడైయవరుక్కు అరుళిచ్చెయ్ ద వార్ త్తైయై స్మరిప్పదు" అనే శ్రీవచనభూషణ చూర్ణికను(235) శ్రీవరవరమునులు వ్యాఖ్యానించేటప్పుడు - శ్రీరామానుజులు పెరియనంబి సన్నిధికి వచ్చి "జీయర్!" అని సంబోధించి వారితో కొన్ని విషయాలను మాట్లాడినట్లు తెలిపిన సంగతి ఇక్కడ ఒక ఉదాహరణగా గమనించవచ్చు. ఈ జీయర్ అనే శబ్దాన్ని గురించి మహావిద్వాన్ కాంచీ ఆణ్ణంగరాచార్య స్వామివారు తెలిపిన కొన్ని విషయాలు ఇక్కడ ప్రస్తావింపబడుతున్నాయి.

సింహం అనే సంస్కృతపదం ద్రావిడ భాషలో "శీయమ్" అని మారడం ప్రసిద్ధమే. శీయమ్ అనే ఈ శబ్దాన్ని"సింహంతో పోలినవారు" అనే అర్థంలో పెద్దలు ప్రయోగిస్తున్నారు. సింహం పెద్ద పెద్ద గజాలనుకూడా వధించేటట్లు, ఆవైదికవాదాలను చేసే పెద్ద పండితులను కూడా విద్వాంసులైన పెద్దలు నిరసిస్తారు కనుక , సింహంతో పోలిన వారిని శీయమ్ అని వ్యవహరిస్తారు. ఇంచుమించుగా ఆ కాలంలో విద్వాంసులు ప్రచురంగా ఉన్నందున, వారికి జీయర్ అనే పేరు తగి ఉండడం గమనించవచ్చు. ఈ పదం తరువాతి కాలంలో సన్యాసుల విషయంలో మాత్రం ఉపయోగింపబడుతున్నది–అని అణ్ణంగరాచార్యస్వామి ఈ పదాన్ని వివరించారు.

కచ్చిక్కీడాంబి యామునాచార్యస్వామి వేరొక వివరణను ఈ పదానికి తెలిపారు. 'శీయన్' అంటే శ్రీమాన్ అని అర్థం. 'శ్రీ' అనే పదం ద్రావిడంలో 'శీ' అని మారుతుంది అనేది ప్రసిద్ధం. ఉదాహరణకు–నమ్మాళ్వార్ల తిరువాయ్ మొళ్ళి ప్రబంధంలోని "మాలరి కేశవన్ నారణన్ శీమాధవన్" అనే సూక్తిని

గమనించవచ్చు. ఇక్కడ 'శ్రీ' అనే పదం 'శీ' అని అయినది. మాన్ అనే మతుప్ ప్రత్యయపదానికి 'కలిగి ఉండడం అని అర్థం .అందువల్ల శీయర్ అనే పదానికి భగవంతుని పట్ల జ్ఞానభక్తి వైరాగ్యలనే శ్రీవైష్ణవశ్రీని కలిగినవారు– అనే కదా అర్థం. "శీ–య్–ఆర్" అని శీయర్ అనే పదాన్ని వివరించాలి. ఈ విధంగా భగవంతుడైన శ్రీమన్నారాయణుని విషయంలో జ్ఞాన భక్తి వైరాగ్యాలను కల పెద్దలు జీయర్ అనే పదంతో వ్యవహరిస్తున్నారని భావించాలి .ఈ పదం అనేక ప్రాచీనగ్రంథాలలో"జీయర్" అని కాకుండా శీయర్ అని ముద్రింపబడిన విషయం గమనించవచ్చు. సమస్తపదంగా ఉన్నపుడు నంజీయర్ అని మనం వ్యవహరించినట్లు, వ్యస్తంగా వ్యవహరించేటప్పుడు కూడా జీయర్ అని భ్రాంతితో వ్యవహరిస్తున్నాము, అంతే .

ఇపుడు, తిరుపతి వాస్తవ్యులు టి. ఏ. కృష్ణమాచార్యస్వామివారు తెలిపిన ఇంకొక వివరణం ప్రస్తావించబడుతున్నది. "జాయతే ఇతి జః, జస్య ఇమే జీయాః" అనేది ఇక్కడ ఇంకొక వ్యుత్పత్తి. ఇది అంతా సంస్కృత పదమే. పుట్టినవానికి సంబంధించినవారు–అని దీని అర్థం. పుట్టినవాడు ఎవడు? - అంటే, లోకంలో జన్మించినవారంతా నిజంగా జన్మించినవారు కారు. దీనికి సంబంధించి ఒక ఆభాణక శ్లోకం ఉన్నది. "పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే, స జాతో యేన జాతేన యాతి వంశః సమున్నతిమ్" అనేది ఆ ఆభాణకశ్లోకం. మాటిమాటికి ఈ లోకంలో జీవులు ఎన్నోసార్లు జన్మించినా, వారు వాస్తవంగా జన్మ కలిగినవారు కారు. ఎవని జన్మవల్ల తన కులం ఉన్నతిని పొందుతుందో, అతడే నిజంగా జన్మించినవాడు–అనేది ఈ శ్లోకంలోని అర్థం. నిజానికి నమ్మాళ్వార్లవంటి వారే "జః" అనే పదంద్వారా నిర్దేశించదగినవారు. ప్రపన్నజనకూటస్థులైన వీరి విషయంలోనే ఈ పదం సార్థకం గనుక, "జః" అనేది వీరిని నిర్దేశిస్తుంది. ఇక్కడ "జః" అనే పదం నమ్మాళ్వార్లను మాత్రమే తెలిపినా, వీరికి అవయవ భూతులైన మిగిలిన ఆళ్వార్లను కూడా తెలుపడంలో ఏ అడ్డులేదు. "జాయంతే ఇతి జాః" (పుట్టినవారు) ఆళ్వారులు, వారికి సంబంధించినవారైన నాథమునులు, శ్రీయామునులు భగవద్రామానుజులు మొదలైన పూర్వాచార్యులను అందరిని "జీయాః" అనే పదం తెలుపుతుంది. "జానామ్ ఇమే జీయాః" అనేది దీని వ్యుత్పత్తి.

ఈ విధంగా తమ కులాన్ని పెంచి అభివృద్ధి చేసి, సత్తను పొందిన ఆళ్వార్లు, వారితో సంబంధాన్ని కల, మన ఆచార్యులవరకు ఉండే పూర్వాచార్యులు అందరూ "జీయాః" అని వ్యవహరింపబడుతున్నారు–అనేది యుక్తి దూరం కాదు. మన పూర్వాచార్యగ్రంథాలలో కొన్ని పదాలకు అర్థాన్ని చెప్పేటప్పుడు కొంత క్లిష్టకల్పన అవసరమవుతుంది. ఈ పదవివరణలో కూడా అటువంటి క్లిష్టమైన కల్పన కనిపించినా, ఆర్థస్వారస్యాన్నిబట్టి అటువంటి సమన్వయాన్ని గ్రహించడంలో ఏ విరోధం లేదు కదా.